# గ్రంథాలయసర్వస్వము.

సంపు. ౩.|| బెజవాడ - మార్చి ౧౯౨౯ ||సంచిక. ౯.


## రామమోహన ధర్మపుస్తక భాండాగారము

(బెజవాడ) యొక్క పదునెనిమిదవ వార్షికోత్సవ సందర్భమున ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ సూరి వేంకట నరసింహ శాస్త్రి గారిచే జదువబడినది. (23-3-29)

శ్రీ రామమోహన ధర్మపుస్తక భాండాగారము 1911 సం॥రంలో స్థాపింపబడెను. ఈసంస్థకు 1912 సం॥రంలో నే నధ్యక్షుడనైతిని. అప్పటినుండి 1923 సం॥రము వరకు ప్రతిసంవత్సరము అధ్యక్షునిగా ఎన్నుకొనబడుచుంటిని. తిరిగి 1928 సం॥రములో సభ్యులందరిచే నేకగ్రీవముగా నాపదవి కెన్నబడి, ఇప్పటి కాస్థానమం దున్నాను. ఈమధ్యకాలములోకూడ నాకు యాజమాన్యము లేకపోయినను ఈ సంస్థతో నాకేదో విధమగు సంబంధముండియే యున్నది. కావున దీనినంతను పురస్కరించుకొని ఈ ప్రతిష్ఠాపనయొక్క జీవితములో ఇట్టితరి, ఈ సంస్థ ఎట్టి ఆదర్శములసంసిద్ధికొరకు వర్థిల్లుచున్నదో, అవి ఎంతవరకు ఫలసిద్ధి నొందుచున్నవో, ముందు జరుగవలసిన కృషి యెట్టిదో, మన దేశమును చీకాకు పరచుచున్న సమస్యలను సమన్వయించుటయందు మా సంఘ మెట్టి స్థానము నలంకరించుచున్నదో మీకు విన్నవించుట ముఖ్యావసరమని నేను నమ్ముచున్నాను

మనకు స్వారాజ్యము లభించినవెంటనే తక్కిన సమస్యలన్నియు సమాధానమగునని మనలో చాలమంది తలంచుచు అందుకొరకై కృషి చేయుచున్నాము. ప్రజలలో నున్న మతభేదములును జాతి భేదములును రూపుమాసినగాని మన దేశమునకు ముక్తి లేదని మన నాయకులు కొందరు వక్కాణించుచున్నారు. అన్నిటికన్న ప్రజల ఆర్థికస్థితి బాగుపడినగాని ఇతర యభివృద్ధి కానేరదనియు అందుకు ముఖ్యసాధ

నము పరపతిసంఘములనిన్నీ అందుకొఱకై దేశక్షేమమును కోరు ఎల్లరు కృషి చేయవలయు ననియు మఱికొందరు చెప్పుచున్నారు. ఈ సమస్యలన్నియును, ఇట్టివే మఱికొన్నియును అనుకూలముగా సమన్వయమైనగాని దేశమునకు క్షేమములేదు. శాంతియుండదు. ప్రజలకు అభివృద్ధి లేదు. మనుజుడు సంపూర్ణ మానుషత్వమును పొందజాలడు.

అయితే వీని కన్నిటికి మూలసాధనము ప్రజలు జ్ఞానవంతులుగా నుండుట. ప్రజలు జ్ఞానవంతులైనగాని ఏవిధమైన యభ్యుచ్ఛ్రియమును గాంచలేరు. అన్ని సమస్యలకు నిదియే పరమతారకము. ఈ విషయములు ప్రభుత్వోద్యోగులకేమి ప్రజానాయకులకేమి కరతలామలకము. కాని ఇందుకొఱకు శ్రద్ధజేయువారు మిక్కిలి యరుదు. మనదేశమునకు స్వరాజ్యము లభించువరకు ప్రభుత్వోద్యోగులు కాలానుగుణ్యమగు సమాధానముల నిచ్చుచు కాలమును గడపుచుందురేగాని ప్రజలను జ్ఞానవంతులనుగా చేయుటకు తగిన దీక్షను వహించరను యంశము మనము దృఢముగా నమ్మవలసియున్నది. ఈ భారము ప్రజలపైన యుండవలసినదే "ఉద్ధరేదాత్మ నాత్మానం."

పారతంత్ర్యమునందున్న యన్ని దేశముల ప్రజలకు ఇందలి తత్వము అనుదినము స్వానుభవసిద్ధము. ఇందువల్లనే ఐర్లాండుద్వీపపు ప్రజలు ప్రస్తుత మనుభవించుచున్న స్వరాజ్యమును పొందకపూర్వము రాజ్యాంగప్రతిష్ఠాపనలకు భిన్నముగ జాతీయతావిజృంభణకు సాధనభూతములగు సంస్థలనన్నిటిని ఆదేశపు ప్రజలే స్థాపించి నిర్వహించుచుండిరి. మనదేశనాయకులలో కొందరుకూడ ఇట్లే చెప్పుట కలదు. ఈవిధానమునే Parellel Government (ప్యారలల్ గవర్న మెంటు) అందురు. మనదేశపుచరిత్రయందును సంఘనియమములందును, స్థానికసంస్థల కార్యములందును విచక్షణాబుద్ధితో అన్వేషించినచో ఈవిషయమునుగూర్చిన అమూల్యమగు కార్యవిధానము గోచరించును. రాజ్యాంగము, సంఘము అను ఒకటి కొకటి లోబడియుండని రెండు ప్రత్యేకసంస్థలు ఆదికాలమునుండియు భరతఖండమున వర్ధిల్లినవి. ఈ రెండు ప్రతిష్ఠాపనలవలనను ఈదేశపు ప్రజలు ప్రప్రథమము

నుండియు నడుపబడుచుండిరి. ఈవిధానము ననుసరించి ప్రజావికాస మునకు సాధనములగు సంస్థలన్నియు సంఘమువలననే నియమింప బడుచు పరిపాలింపబడుచు యుండెను. అట్టివన్నియు ప్రభుత్వమునకు లోబడియుండ లేదు. అందువల్లనే భరతఖండమును నానారాజులు పరి పాలించినను, ఇందు నానామతములు చొచ్చినను, ఎన్నియో నాగరి కత లిచ్చట ప్రవేశించినను ఎన్నియో అల్లరులు దోపిడులు జరిగినను భారతీయసభ్యత విలక్షణమై, అందుకు జీవమగు పరిజ్ఞానము తెంపు లేక ధారావాహికముగా నుండునట్లు, ప్రత్యేక వ్యక్తిత్వమును కాపాడుకొనుచు సక్రమాభివృద్ధిని గాంచుచున్నది. ఈసాంప్రదాయమే భారతీయసభ్యత తక్కిన ప్రపంచకమునకంతకును ఉపదేశించు పరిజ్ఞాన విశేషము.

ఈసిద్ధాంతమునకును మాప్రతిష్ఠాపనాకార్యములకును సం బంధ మెట్టిదో వివరించవలసియున్నది. గవర్నమెంటువారివలనగాని స్థానికసంఘమువలనగాని ఏవిధమగు సహాయము పొందకనే ఈభ వనము నిర్మింపబడిన స్థలమును వేలముపాటలో మేము కొనియుంటిమి. ఈభవననిర్మాణమునకు వ్యయమైన ద్రవ్యమునంతను ప్రజలనుండియే మేము సంపాదించియున్నాము ఇట్లుగాక ప్రభుత్వము వారివలన ఏకొద్ది సహాయమునో అపేక్షించినవారు ఎట్టి యిక్కట్టులకు లోబడిరో మనలో కొందరైనను ఎరుగనివిషయము కాదు.

కావున ఈ ప్రతిష్ఠాపనయొక్క ప్రధానసూత్రము స్వాతం త్ర్యము. అందువలననే ఇందు ప్రజాభివృద్ధికరములగునట్టియు ప్రజా సేవను పురికొల్పునట్టియు ఉద్యమము లిందు యుద్భవిల్లినవి.

1918 సం॥రం ఆప్రాంతములో కృష్ణానది, కొల్లేరు పొంగి తత్ త్ప్రాంతముల ప్రజలకు మితిలేనినష్టము కలిగినపుడు వారలకు సహాయ ము చేయుట కేర్పడిన సంఘమును ప్రథమములో ఈ సాంఘికులే ప్రారం భించిరి. ఆంధ్రదేశమం దంతటను వ్యాపించి అనేకయువకుల కార్య దీక్షను, సేవాపరతంత్రతను, దేశాభిమానమును, చూఱగొన్న ఆంధ్ర బాలభటసంఘముయొక్క కార్యాలయ మిందే యుండెను. అందలి

ముఖ్య కార్యనిర్వాహకులు ఈ సంఘ సభ్యులే. మన దేశమందలి ఇతర బాలభటోద్యమములకును, యాంగ్ల యుద్యమమునకును గల ముఖ్యభేద మేమనగా ఆంధ్రోద్యమము ప్రభుత్వోద్యోగులకు సంబంధము లేకుండనే ఉద్భవిల్లినది అభివృద్ధిని గాంచినది.

రెండవ యంశము :—అన్ని మతముల వారలకు సమానముగ యాదరణ ముండునట్లును, మన దేశమం దుద్భవించుచున్న నానా రాజకీయ పక్షములలో ఏకపక్షవారితోను ఏకీభవించక అందరికిని సామాన్యమగు ఆశయముల సంసిద్ధికొరకును ఈ సంఘము ప్రథమమునుండియు కృషి చేయుచున్నది. ఈ సంస్థయొక్క యాదరణకింద హిందూమత ప్రవక్తలయొక్కయు పుణ్యపురుషులయొక్కయు వర్ధంత్యుత్సవము లెట్లు జరుపబడుచున్నవో అట్లే మహమ్మదీయుల పండుగలుకూడ జరుపబడుచున్నవి. ఇందుకు అన్నిటికన్న ఈసంఘము ఎవని యశస్సును గానము చేయుటకు స్థాపించబడెనోఅట్టి శ్రీరామమోహనరాయలే ప్రథమసాక్షి. ఇందువలననే సర్వపక్షములవారును, అన్నివృత్తులందున్నవారును ఈసంస్థయొక్క అభివృద్ధికొరకు ప్రప్రథమమునుండి కృషి చేయుట తటస్థించుచున్నది. ఇకముందుకూడ ఇందుకు భిన్నముగా జరుగుటకు కారములు లేవు.

మూడవయంశము:— జ్ఞానము అనంతము, మనుజుడు ఆమరణాంతము సంపాదించుట కుద్యమించవలసినది. ప్రజలు నానావిధమగు శక్తులు, వివిధరుచులు, వేరువేరు తెలివితేటలు, అసంఖ్యాకములగు పరిస్థితులతోను యున్నవారు కావున ప్రజల జ్ఞానాభివృద్ధి కొరకు వర్ధిల్లెడి ప్రతిష్ఠాపనలలో ప్రధానమగు ధర్మగ్రంథాలయమందు వివిధాంతరములు గల ప్రజలకు వారివారి కనువగుమార్గముల ననుసరించి జ్ఞానోపార్జనముకు తగిన సాధన విధానముల నవలంబించుట ముఖ్యకర్తవ్యము. అంతకన్న ముందు ప్రజల నందరును అచ్చటి కాకర్షించుపని గూడ ధర్మగ్రంథాలయ విధియే. ప్రాచీనకాలమందు మన దేశమందిట్టి సంస్థ లుండియుండెను. మన దేవాలయము లిట్టివి. మన సాంఘికోత్సవము లిట్టివి మనగ్రామసంఘము లిట్టివి. వీని యన్నిటికన్నను ప్రతిదినము గ్రామస్థులందరు తమతమ వృత్తులకు సంబంధించిన పనులన్నియు తీర్చు

కున్న పిదప ఏమఱ్ఱిచెట్టు క్రిందనో, ఏగ్రామచావడియందో, ఏరచ్చబండవద్దనో సమావేశమై ఇహపరసౌఖ్యసాధనములగు విషయములను గూర్చి ఇష్టాగోష్ఠులు జరుపు సమావేశములు నిట్టివియే.

గ్రంథాలయ మన్న పురాతనకాలములందు కేవలము గ్రంథ నిక్షేపములుగా నుండెను గాని ఇప్పటికాలపు సంస్థ లట్టివి గావు. ఈయుద్యమము ఈకాలమునందు మనదేశములో బరోడా రాష్ట్రమందు మిక్కిలి అభివృద్ధిని గాంచినది. కావున పైనచెప్పిన ప్రాచీన సంస్థలయం దిమిడియున్న సాంప్రదాయ సూత్రముల ననుసరించియు, అభివృద్ధిదాయకములగు ఆధునిక కార్యవిధానము నవలంబించియు ఈసంస్థను నడిపినగాని తగినంత లాభము చేకూరదని మేము నిశ్చయించుకొంటిమి. అందుకు ఫలితముగ అప్పటికిని ఇప్పటికిని మాసంఘ కార్యదర్శిగారగు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు బరోడానగరమునకు వెళ్ళి అచ్చట అఖండముగాజరుగుచున్న కేంద్రగ్రంథాలయసంస్థయొక్క కార్యములను విచక్షణతో అభ్యసించి వచ్చిరి. అందుకు ఫలితముగ మా సంస్థయందు కొన్నిటి అభివృద్ధిని ఇదివరకే చేయగల్గితిమి. అందు బాలశాఖ ముఖ్యమైనది. సంచారగ్రంథాలయ పేటికలను గూర్చి ప్రయత్నించుచున్నాము. అచ్చటచ్చట ప్రోత్సాహము వచ్చుచున్నది. అచిరకాలమున ఫలవంతమగునని నమ్ముచున్నాము.

మరియొక యంశము. గ్రంథవిస్తర భీతితో ఇంతటితో విరమించుచున్నాను. ఆదికాలము నుండియు దానము మనదేశమునందు పరమ ధర్మముగా పరిగణింపబడుచుండెను. ఈదానము మనదేశీయులలో చాలమంది దేవళములకును, సత్రములకును మాత్రమే వినియోగించుచున్నారు. మన సాంప్రదాయ మట్టిదికాదు. "సప్తసంతానములను" ప్రతీతినిబట్టి ప్రజోపయోగకరమగు అన్నికార్యములనుగూర్చి దానము చేయుటయే పురాతనకాలమునుండియు ఇచ్చట జరుగుచున్న దని మనకు బోధపడుచున్నది.

మాసంఘచరిత్రలో దానమునకు పరమపాత్రతను గమనించుటయు, అందుకొరకు ఉదారమగు ఈవిని ఇచ్చుటయు సంసిద్ధినొందెను.

మా భవననిర్మాణమునకు కారణభూతు లగు కీర్తిశేషులగు నడింతిర్వూరు జమీందారుగారగు వెల్లంకి చినవెంకట్రామారావుగారు ఇందుకు మార్గదర్శకులు. మాసంఘమునకు స్త్రీశాఖను వేరుగా నిర్మించుటకు వల్లూరు వెంకాయమ్మగారు రు 2000 లు సొమ్మును అవ్యాజముగా నిచ్చి కృతార్థులైరి. మన మిప్పుడు సమావేశమైన హాలు శ్రీయుత కొత్తా సూర్యనారాయణరావుగారు నిర్మించియున్నారు. అచిరకాలమునదీనినిపూర్తిచేయుటకు మేము ఆతురతతో ఎదురుచూచుచున్నాము.

మా సంఘముయొక్క ఆశయము లెట్టివో మీకు క్లుప్తముగా మనవి చేసి యున్నాను. మా కింక నెన్నియో యాశలున్నవి. ఈ మధ్య అఖిల భారత గ్రంథాలయ సభాసందర్భమున కలకత్తానగరమునకు మాలో కొందరేతెంచినపుడు అచ్చట వంగీయ సాహిత్య పరిషత్సంఘభవనమును సందర్శించి యుంటిమి. అచ్చట జరుగుచున్న భాషాసేవయు దేశసేవయు అఖండము. అందు ముఖ్యముగా అనుకరించవలసిన విషయ మొకటి నాకు గోచరించినది. వంగభాషకు సేవచేసి కీర్తినొందిన కవులందరకు అచ్చట ప్రతిమలను పెట్టి యున్నారు. మన రామమోహన ధర్మ గ్రంథాలయమున మన యాంధ్రకవుల నందరను మన మెందు కిట్లు ఆరాధించకూడదు. ఈ సూచనను తమ కందరకు నేను చేయుచున్నాను. మనయధ్యక్షులిప్పుడు బహిరంగ పరచుచున్న దాసు శ్రీరామపండితుల ఛాయాపటము ఈ భవనమునందుంచుటయే ఇందుకు శుభసూచకము. ఇంక నెన్నియో విధముల మా సంఘ మభివృద్ధి చెందవలసి యున్నది. మా భవనము మూడు అంతస్తుల మేడకట్టుటకు తగినట్లు పునాదులు వేసియున్నాము. అట్లే మాసంఘముయొక్క ఆశయము లతివిశాలము లైనవి. వానిని సంసిద్ధించు భారము మీయందరియందున్నదని సవినయముగా మనవి చేయుచు ఇంతటితో విరమించుచున్నాను.



# రామమోహన ధర్మపుస్తక భాండాగారము

యొక్క పదునెనిమిదవ సమయమున సహాయ కార్యదర్శి,

మోచర్ల పూర్ణచంద్రరావుగారు చదివిన కార్యనివేదిక.

చరిత్రాసంగ్రహము:—శ్రీరామమోహన ధర్మపుస్తకభాండాగారము 1903 వ సంవత్సరము, కలకత్తా వాస్తవ్యులగు శ్రీయుత బాబు హేమచంద్రసర్కారుగారి వలనను లండనునగరమందున్న బ్రిటిషు అండు ఫారిన్ యూనిటేరియన్ సంఘమువారివలనను ధర్మముగా నొసగబడిన 200 పుస్తకములతో "ఆస్తికభాండాగారము" అను నామమున ప్రార్థనాసమాజమందిరమున శ్రీయుత ఇ. సుబ్బకృష్ణయ్యగారు స్థాపించిరి. కాని అయ్యది ఒకమారుమూలనుండుట బట్టి జనసామాన్యమున కుపయోగకారి కాజాలదయ్యె.

ఇట్లుండగ 1911 సంవత్సరము జనవరి మాసమునందు కొందరు యువకులుకూడి స్వల్పముగ చందాలు వేసికొని ప్రార్థనా సమాజమువారి యనుమతిమీద ఆ పుస్తకములను తీసికొని వచ్చి బకింగుహాముపేటలో "రామమోహన ధర్మ పుస్తకభాండాగారము" అను నామమున బ్రస్తుత భాండాగారము నెలకొల్పిరి.

ప్రథమమున కొందరుపెద్దల నడిగి ఒకటి రెండు వార్తాపత్రికల నుచితముగా దెచ్చి సాయంకాలమునందు చదువుకొను చుండిరి. వసూలైన చందాలమొత్తము యింటిఅద్దెకును దీపపు ఖర్చులకును మాత్రము సరిపోవుచుండెను. కాని భాండాగారము అట్టి హీనస్థితి యందు రెండుమాసములకన్న ఎక్కువకాల ముండక దినదినాభివృద్ధి నొందుచు వచ్చినది.

ఇట్లు భాండాగారము అభివృద్ధి చెందుచుండగా 1912 సంవత్సరము సెప్టెంబరు 19 వ తేదీన ఎడ్వర్డు పురమందిరమున యీ భాండాగారము యొక్క ప్రథమవార్షికోత్సవము జరుపబడెను. ఆయుత్సవ సమయమున తిరువూరు రాజాగారగు కీ॥ శే॥ లయిన శ్రీరాజా వెల్లంకి చిన వేంకటరామారావు బహద్దరు జమీందారుగారు 'యీ గ్రంథాలయమువారు నివేశన స్థలము సంపాదించుకొనినచో తాము భవనమునుకట్టించుటకగు ఖర్చులను యిచ్చెదమని వాగ్దానము చేసిరి.

ఈ గ్రంథాలయము అప్పటికి రిజష్టరుఅయి వుండకపోవుటచే కొన్నిచట్టముల నేర్పరచి 8-4-13 వ తేదీన కృష్ణాజిల్లా రిజష్ట్రారు వారి ఆఫీసునందు 1860 సం. 21 వ నెంబరు ఆక్టుప్రకారము రిజిష్టరు చేయబడెను. తరువాత నివేశన స్థలమును సంపాదించవలెనని తలచు చుండగా యీగ్రంథాలయము రిజష్టరు చేయబడిన రెండుదినములకే అనగా 10-4-1913 వ తేదీన బెజవాడ మునిసిపాలిటీవారు నివేశన స్థలములను వేలమునకు విక్రయించెద మని ప్రకటించిరి. అప్పుడు 2191 చ॥గలు గల యీస్థలము రు 3424-2-3 లకు కొనబడెను. ఈ భాండాగారమునకు అప్పటికి మూలధనమేమియు లేకపోవుటచే మునిసి పాలిటీవారికి స్థలము ఖరీదుక్రింద ఈయవలసిన రు 3424-2-3 అప్పుగా తీసికొనివచ్చి వారికి చెల్లింపబడెను. యీ అప్పుగా తీసికొనివచ్చిన సొమ్ములో కొంతభాగము చందాలవల్ల వేయబడెను.

నివేశన స్థలము కొనినపిదప భవనము నిర్మింపవలసియుండుటచే శ్రీతిరువూరు రాజాగారివద్దకు బోయి వారివాగ్దానము చెల్లింపవలసిన దని కోరగా వారందుల కియ్యకొనిరి, అప్పుడు మద్రాసు గవర్నరుగారి కార్యనిర్వాహకసభయందు సభ్యులుగనుండి ఘనతవహించిన సర్. పి. యస్. శివస్వామిఅయ్యరుగారిచే 1-9-1913 వ సంవత్సరమున పునాదిరాయి వేయబడెను.

ఇంటిఅద్దె నెలకు రు 20 చెల్లించుటకు కష్టతరముగ నుండుటచే ప్రథమమున ముందుభాగమున రెండుగదులనుమాత్రము తయారుజేసి 22-2-15 వ తేదీన భాండాగారము యిచటికి మార్చబడెను. నాటి నుండి భాండాగారము యీభవనమునందే యుండి, యీభవనము ప్రస్తుత స్థితికి క్రమక్రమముగా తీసికొని రాబడెను.

1. గ్రంథముల సంఖ్య.

గ్రంథాలయము ప్రథమమున 1911 వ సంవత్సరమున జనవరి నెలలో 200 గ్రంథములతోను, 8 గురు సభ్యులతోను స్థాపింపబ డెను. 1913 వసంవత్సరమునకు 1000 పుస్తకములున్ను మాసమునకు 60 రూపాయలు చందా చెల్లించెడి 120 మంది సభ్యులతోను తేజ రిల్లినది. 1924 సంవత్సరమునకు 2356 ఆంగ్లగ్రంథములున్ను 1618

తెనుగు గ్రంథములున్ను 119 సంస్కృత గ్రంథములున్ను 43 హిందీ గ్రంథములున్ను మొత్తము 4135 పుస్తకములు గలవు. 1927 వ సంవత్సరాంతమునకు 2550 ఆంగ్లగ్రంథములున్నూ 1560 తెలుగు గ్రంథములున్ను, 45 హిందీగ్రంథములున్ను మొత్తము 4301 గ్రంథములు కలవు. 1928 వ సంవత్సరాంతమునకు 1720 తెలుగుపుస్తకములున్ను 48 హిందీగ్రంథములున్ను 156 సంస్కృత గ్రంథములున్ను 2615 ఇంగ్లీషు గ్రంథములున్ను మొత్తము 4539 గ్రంథములు గలవు. ఇట్లు నానాటికి భాండాగారమునందు పుస్తకములయొక్క సంఖ్య వృద్ధియగుచున్నది.

యీ గ్రంథాలయమునకు 1916 సంవత్సరమున రు 404 1 6 ల పుస్తకములున్ను, 1920 వ సంవత్సరమున రు 137 8 0, 1922 వ సంవత్సరమున రు 252 12 0 పుస్తకములున్ను, 1923 వ సంవత్సరమున రు 963 3 0 ల విలువగల పుస్తకములున్ను చేర్చబడినవి. యింకను పెక్కు గ్రంథరాజములు చేర్చుటకు అవకాశము కలదు. ప్రస్తుతమువున్న భవనము బీరువాలు పుస్తకములను పెట్టుటకు సరిపోకుండుటచేత భాండాగారము వృద్ధిచేయుటకు అవకాశము చాలకున్నది. దైవానుగ్రహమువల్ల రెండవఅంతస్థు నిర్మింపబడినవెంటనే యింకను పెక్కు గ్రంథములను చేర్చగలమని మాకు విశ్వాసము గలదు. యీ గ్రంథాలయమందు పెక్కువిషయములకు చెందిన పుస్తకములు అనేకములు కలవు జ్యోతిష్యము, వైద్యము, వ్యాయామము, అర్థశాస్త్రము మొదలుగాగల శాస్త్రములందుకూడ ముఖ్యమైన పుస్తకములు యీ భాండాగారమున కలవు.

ఈ గ్రంథాలయమునకు 50పత్రికలు వచ్చుచున్నవి.

చందాదారులు :—

నేడు మొదటితరగతి చందాదారులు 6 మంది, రెండవ తరగతి చందాదారులు 63 మంది, మూడవతరగతి చందాదారులు 46 మంది యున్నారు. చందాలవల్ల నెల 1 కి అరవై రూపాయిలు వసూలు అగుచున్నది. యితర గ్రంథాలయములవలె పుస్తకములు చందాదారులు యింటివద్ద చదువుటకు చందాదారులవద్ద డిపాజిటు

పుచ్చుకొను పద్ధతి యీ గ్రంథాలయమున లేదు. జనసామాన్యమునకు గ్రంథములను చదువుట కవకాశము ఎక్కువ కలుగజేయుటకై (deposit) పుచ్చుకొనకుండు పుస్తకములను యిండ్లకు యిచ్చుచుంటిమి.

స్త్రీ శాఖ:—

స్త్రీలు చదువుకొనుటకు ఉచితముగ వారి యిండ్లకు యిచ్చు చున్నాము. స్త్రీశాఖకు ప్రస్తుతము సభ్యులు 60 గురు ఉన్నారు. యీ రామమోహన గ్రంథాలయమునకు ప్రక్కనున్న బ్రహ్మ సమాజ మందిరమున స్త్రీ శాఖా కార్యాలయము యేర్పరుప బడినది. స్త్రీలు తమకు కావలసిన గ్రంథములు గ్రంథాలయమునుంచి అక్కడికి తెప్పించుకొందురు. స్త్రీశాఖకు ప్రత్యేకభవననిర్మాణమునకై శ్రీమతి వల్లూరి వెంకాయమ్మగారు రు 2000-0-0 లు విరాళము నొసగిరి. దైవకృపవలన కొలదికాలములో స్త్రీశాఖకు ప్రత్యేకభవనము తయారుకాగలదని మా నమ్మకము.

ఋణములు :—

గ్రంథాలయము స్థాపించినప్పుడు ఏమాత్రమును ఆదాయము లేక అప్పటిసభ్యులు కార్య నిర్వాహకసభ్యులు వారియొక్క ఉత్సాహము వల్ల నిలువబడినది. ఈ గ్రంథాలయము 8-4-1913 లో రిజిష్టరు చేసినపుడు రిజిస్ట్రేషనుకర్చులుకూడా ఆదాసొమ్ము లేనందున అప్పటి కార్యదర్శిగారు రిజిస్ట్రేషనుకర్చులు పెట్టుబడి పెట్టవలసివచ్చెను. మునిసిపాలిటీవద్ద వేలములో రు424-2-3 పైసలకు మా కార్యదర్శిగారు వేలములో కొట్టివేయించుకొనిరి. పాట కొట్టివేయించుకొనిరి గాని ఆదినముననే వేలము సొమ్ములో నాల్గవవంతు మునిసిపాల్టికి చెల్లించవలసియున్నది. కాని సంఘమునకు ఆస్తిలేదు. అప్పు నిచ్చువారుకూడ లేరు. మొదటినుండియు యీ గ్రంథాలయమును మొక్కను, పాదుచేసి, పెంచి, యీస్థితికి భద్రముగా కొనివచ్చిన మ. రా. రా. శ్రీ. సూరి వేంకట నరసింహశాస్త్రిగారు సొంతమున నోటు వ్రాసి సొమ్ము తెచ్చి మునిసిపాలిటీకి నాల్గవవంతుసొమ్ము కట్టిరి. తరువాత మ. రా. రా. శ్రీ. సూరి వేంకటనరసింహశాస్త్రుల్లుగారు మ. రా. రా. శ్రీ. అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు ఉభ

యులు కలసి బొడ్డపాటి వెంకటప్పయ్య పంతులుగారి పేర నోటువ్రాసి మిగిలిన మూడువంతులు సొమ్ము మునిసిపాలిటీకి చెల్లించిరి. తిరువూరు జమీందారుగారగు కీ॥ శే॥ లయిన శ్రీ రాజా వెల్లంకి చిన వేంకట రామా రావు బహద్దరు జమీందారుగారు భవన నిర్మాణమునకు సొమ్ము నొసంగిరి. విజయవాడ పట్టణ వాస్తవ్యులు పెక్కండ్రు భూరి విరాళముల నొసంగి గ్రంథాలయమును నిలువబెట్టిరి. 13-1-1916 వ సంవత్సరమునాటికి గ్రంథాలయమునకు రు 11535-8-2 ల స్థిరాస్తియు 4000 రూపాయిల ఋణములున్ను యుండియున్నది. ఇదిగాక పుస్తకములు కర్రసామానులు ఇతర సామానులు యుండియున్నవి. గ్రంథాలయముయొక్క ఋణము నానాటికి పెరుగుచూ వచ్చెను. యీ క్రింద ఉదహరించినవారు వారికి గ్రంథాలయమువల్ల రావలసిన బాకీలను వదలుకొనుటవల్లను, చందాలక్రింద జమకట్టించుటవల్లను ఆయా బాకీలు రద్దుపడినవి.

| | |
|---|---|
| మ. రా. రా. శ్రీ. గూడూరు లక్ష్మణరావుపంతులుగారు | 941-1-3 |
| మ. రా. రా. శ్రీ. సూరి వేంకట నరసింహశాస్త్రిగారు | 3000-0-0 |
| ఆయుర్వేద ధర్మ వైద్యశాల | 600-0-0 |
| శ్రీమతి అయ్యంకి మంగమ్మగారు | 1000-0-0 |
| సోషల్ సర్వీసు లీగు | 1200-0-0 |

యింకను కొద్దిబాకీలు చందాలు వగైరాలవల్లవచ్చిన సొమ్ముతో తీర్చబడమయినది. పైన ఉదహరించిన బాకీలు తీరుటకు మ. రా. రా. శ్రీ గూడూరు లక్ష్మణరావుగారు, సూరి వేంకట నరసింహశాస్త్రిగారు, శ్రీమతి అయ్యంకి మంగమ్మగారు మ. రా. రా. శ్రీ బొడ్డపాటి వేంకటప్పయ్య పంతులుగారు యింకా యితరులు చేసిన సహాయమునకు వారల కెంతయు కృతజ్ఞులము. వారు గ్రంథాలయమునకొనర్చిన మేలు మరచుటకు వీలులేదు. నేడు గ్రంథాలయము ఋణవిముక్తయై యున్నది.

ఈ గ్రంథాలయ భవననిర్మాణ ప్రయత్నమునందు అనేక విధముల సహాయపడి, రెండవఅంతస్తు కట్టించుటకై కంకణముకట్టిన శ్రీయుత కవుతా సూర్యనారాయణరావుగారికి గ్రంథాలయమువా రందరు కృతజ్ఞతను జూపుచున్నారు. వారి అనుగ్రహమువల్ల అచిర

కాలములోనే మన భవనమున రెండవఅంతస్తును చూడగలమని నమ్ముచున్నాము.

గ్రంథాలయముయొక్క కొరతలు :—

గ్రంథాలయముయొక్క రెండవ అంతస్తు పూర్తిచేయుట ముఖ్యమయినపని. అది పూర్తిఅయినగాని క్రొత్తపు స్తకములను చేర్చుటకుగాని భాండాగారపు పుస్తకములను గ్రంథాలయమువద్ద చదువు జనులకు తగిన సౌకర్యముల నేర్పరచుటకు వీలులేదు. తరువాత గ్రంథాలయముచుట్టు ప్రహరీగోడ, కుర్చీలు, బీరువాలు, అత్యంతావశ్యకమయి యున్నవి. పైకార్యములు అన్నియు మహాజనుల ఔదార్యము వలననేగాక వేరువిధమున నెరవేర్చబడజాలవు. కావున మహాజనులు పుస్తకముల నొసంగుట మూలముగను ద్రవ్యసహాయము చేయుట మూలముగను తోడ్పడవలయును.

గత సంవత్సరము చందాలవల్ల 533-14-0 లున్ను, బెజవాడ మునిసిపాలిటివారివల్ల రు 480-0-0 లున్ను పుస్తకములను కొనుటకుగాను దొరతనమువారు యిచ్చిన రు 200-0-0 లున్ను వసూలు ఆయినవి.

కృతజ్ఞత:—

మాభాండాగారమునకు ప్రప్రథమమున తమవద్దనున్న గ్రంథముల నన్నిటి నిచ్చి భాండాగార స్థాపన కాధారభూతులయిన శ్రీ బెజవాడ ప్రార్థనా సమాజమువారికిని,

మొదటినుంచి యీభాండాగారము వృద్ధిపొందుటకు పెక్కువిధముల తోడ్పడుచు భాండాగారమును ఋణబాధనుండి తొలగించిన పెద్దలకును మా గ్రంథాలయాభివృద్ధికై మొదటినుండియు విశేషముగా పాటుపడిన మా అధ్యక్షులుగ నున్న శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రి గారికి, మా కార్యదర్శిగారయిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారికి ఈ భాండాగారముయొక్క కొరతలన్నియు దీర్చి చాలవరకు తోడ్పడిన శ్రీ గోపరాజు బ్రహ్మానందంగారికి, శ్రీ బొడ్డపాటి వెంకటప్పయ్య పంతులుగారికి, శిష్ట్లా వేంకటకృష్ణయ్య పంతులుగారికి శంకర వేంకటరామయ్యగారికి, వేలమూరి గోపాలకృష్ణయ్యగారికిని,

కొండా సూర్యనారాయణరావుగారికిని, శ్రీ వల్లూరి వెంకాయమ్మ గారికిని యింక యీ భాండాగారమును అభివృద్ధికి దెచ్చుటకై తోడ్పడిన యితరులకు కృతజ్ఞతాపూర్వకమయిన వందనములు అర్పించుచున్నారము. ఈసదుద్యమమునకు యీశ్వరుడు తోడ్పడుగాక !

# రామమోహన ధర్మగ్రంథాలయము - బెజవాడ.

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతక్రింద ఈ గ్రంథాలయముయొక్క పదునెనిమిదవ వార్షికోత్సవము మార్చి 23, 24, తేదీలయందు మిక్కిలి వైభవముగ జరిగినది.

ప్రథమదినమున సాయంకాలము సంఘాధ్యక్షులగు శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రిలుగారు స్వాగతము నిచ్చిన పిమ్మట సభాధ్యక్షులు దాసు శ్రీరామ పండితుని పటమును బహిరంగపరచిరి. తరువాత అబ్బూరి రామకృష్ణారావుగారు ఆధునికాంధ్రవాఙ్మయమునుగూర్చి ఉపన్యసించిరి. అభినవపద్యములు జదువబడెను.

* * * * *

## అధ్యక్షోపన్యాసము.

పిమ్మట శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిటుల నుపన్యసించిరి:—నన్ను అధ్యక్షులుగ ఎన్నుకొనినందులకు కృతజ్ఞుడను. పద్యములు, శ్లోకములు, చదివినవారికికూడ కృతజ్ఞుడను. కాని అందుగల అతిశయోక్తులకు నేనంగీకరించను. భవన నిర్మాణమునుగూర్చి నా మిత్రులు సూచించినారు. భవననిర్మాణము భగవదాయత్తము ఈశ్వరసంకల్పానుసారముగ సర్వకార్యములు సానుకూలమగును. రామమోహన గ్రంథాలయమును నామిత్రులు సూరి వేంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్యగారలు స్థాపించినదాదిగ నాకుకూడ వారితోపాటు గ్రంథాలయోద్యమమునందు సంబంధము గలదు. గ్రంథాలయోద్యమము కొంత ఉపకారము చేసినది. విజ్ఞా

నము పరిబోధము యీ యుద్యమమువలన లభించినవి. విజ్ఞానమునంతను ఒకచోట చేర్చుట గ్రంథాలయోద్యమము దృక్పథమునందుంచుకొనినది. గ్రంథాలయముయొక్క ఉపయోగమును గ్రహించగల అధికారినికూడ యీ యుద్యమము తయారు జేయవలెను. అందులకు తగిన గ్రంథాలయపాలకు డుండవలయును. ప్రజల విజ్ఞానాభివృద్ధి మన కవసరము. అందులకు గ్రంథాలయము లత్యవసరములు.

అసహాయోద్యమము వచ్చినపిమ్మట మనము రాజకీయరంగమున ప్రవేశించినాము. ఇచట ప్రవేశించుటవలన గ్రంథాలయోద్యమము వెనుకబడినను అది మంచికొరకేనని నా అభిప్రాయము. మనము 400 యేండ్లక్రింద మన సంప్రదాయమును వదలినాము. మఱచిపోయినవానిని మరల కావలయుననుచున్నాము. 400 ఏండ్లు సంఘర్షణ జరిగిన పిమ్మట వెంటనే సహచర్యము లభించుట దుస్తరము. అందులకు సంపూర్ణస్వాతంత్ర్యము మనకు లభించవలయును. మన ప్రజ్ఞ బయల్పడుటకు స్వాతంత్ర్య ముండవలయును మన మనసు సంపూర్ణముగ బానిసత్వమునం దున్నది.

గాంధీమహాత్ముడు స్థిరప్రజ్ఞుడు. ఆయన చూపిన అసహాయమార్గము మనము అవలంబించి స్వతంత్రులము కావలయును. స్వాతంత్రిత లేనిది యేకార్యమును సాధించజాలము. పోతన కైవల్యప్రాప్తికి భంగము వచ్చునని ఎవరికిని కృతినీయలేదు స్వాతంత్ర్యబుద్ధి మనకు లభించినది. మనము స్వతంత్రులము కాజాలము ఈ ఉద్దేశ్యముతో ప్రాజ్ఞులెల్లరు యీ యుద్యమమున చేరినారు. దానితో గ్రంథాలయోద్యమమునకు దెబ్బతగిలినది. అసహాయోద్యమమునకు సంపూర్ణవిజయము చేకూరలేదు. కాని అందువలన మనము నిరుత్సాహము చెందనక్కఱలేదు. క్రమేణ వచ్చిన వికాసమే సరియైన వికాసము. అట్లగుటంజేసి అసహాయోద్యమ ఫలితము కూడ స్థిరముగ నుండగలదని నమ్ముచున్నాము. స్వరాజ్యము వచ్చుసరికి మనము దాని ననుభవించగల అధికారమును పొందవలసియున్నది. వర్తమాన ప్రయత్నములకు పూర్వప్రయత్నములకు సహచర్యము కుదర్చవలయును. భిన్నత్వమున ఏకత్వము సిద్ధించవలయును.

పూర్వపు విజ్ఞానము పునరుద్ధరించ బడవలయును. ఇట్టి ఆశయములతో ఈ గ్రంథాలయము స్థాపించబడి పనిచేయుచున్నది. ప్రయోజనము స్థాపించినవారి ఆశయములను బట్టి యేర్పడును. సంపూర్ణ పరిజ్ఞానము గలవారు గ్రంథాలయపాలకుడుగ నుండుటవసరము.

మనము ఆంధ్రవాఙ్మయ చరిత్రము పరిశీలించితిమేని యే యుగమునందైనను మతము వేదాంతము మనల నాకర్షించినటుల విదితమగుచున్నది. ఐదేండ్లనుండి ఆంధ్ర వాఙ్మయ చరిత్రను తయారు చేయున్నాను. 12000 అచ్చు అయినట్టివి, 15000 అముద్రితములయి నట్టియు గ్రంథములుగలవు. ఈ వాఙ్మయమునుబట్టి చూచితిమేని ధర్మమునిూద, మతమునిూద, ఆంధ్రులకు అభిలాష మెండుగనున్నట్లు స్పష్టపడుచున్నది. పెద్దన మనుచరిత్రయందు ధర్మజ్ఞానముల సమన్వయము కుదిర్చినాడు. భక్తిజ్ఞానముల సమ్మేళన మొనర్చినాడు. సజీవులైన ప్రజలలో భాషయందు మార్పుజరిగి తీరును. అయితే పూర్వాపర సందర్భముల ననుసరించి మార్పు అవసరము. భావసంశుద్ధిగల వాఙ్మయ నిర్మాతలు భాషను సంస్కరించగల అధికారులై యున్నారు. అంతియేగాని ఏ కొద్దిగనో తెలుగును చదివి భాష సంస్కరించ గలుగుదు మనుట సరియైన పనికాదు. ఏది ఎట్లున్నను సంపూర్ణ స్వారాజ్యము సిద్ధించిన గాని సంపూర్ణ నిర్మాణశక్తి మన కలవడదు. మన ప్రబంధకర్తలు 300 ఏండ్లనుండి గుడ్డిగ ప్రాతమార్గముల ననుసరించుచున్నారు, ఆస్వతంత్రతయే యిందులకు కారణము. మనము స్వతంత్రులమైనచో పూర్వాచారము వదలి నూతన వికాసమును సృష్టించ గలుగుదుము.

గ్రంథాలయమును గూర్చి యొక్కమాట చెప్పుచున్నాను. గ్రంథాలయమును సోషల్ క్లబ్బుగ మార్చకూడదు. రెంటి ఆశయములు వేర్వేరు. గ్రంథాలయమునందు పత్రికాపఠనము గ్రంథపరిశీలన, సంఘసేవ, దేశసేవ, ప్రధానకార్యములు. కృష్ణ వరదల సందర్భమున రామమోహనగ్రంథాలయ మొనర్చిన సేవ ప్రశంసనీయము. ఈభవనము పూర్తికాలేదని కొందరు చెప్పిరి. త్రివిక్రమరావుగారు పాశ్చాత్య దేశమునందలి గ్రంథాలయములకు గల మహో

సాధములను వర్ణించిరి. పదిమంది జేరి యీ పనిని చేయుదమనే స్థిర సంకల్పమున్నచో పూరిగుడిసె యైనను సరిపోవును. సత్సంకల్పము అవసరముగాని మహాసౌధము కాదు. వర్తమానకాలమున దేశము, సంఘము, వాఙ్మయములకు సేవచేయుట మన విధిగా యున్నది.

కేంద్రగ్రంథాలయ ప్రయత్నము సఫలమగుట.

రెండవదినము ఉదయమున బ్రహ్మశ్రీ చెరుకుపల్లి బుచ్చి రామయ్యగారు సూర్య నమస్కారములను గూర్చి బోధ గావించిరి.

సాయంత్రము శ్రీ దేశోద్ధారకుని అధ్యక్షతక్రింద మరల సభ జరిగెను. శ్రీయుత భోగరాజు పట్టాభిసీతారామయ్యగారును, శ్రీమతి నల్లముత్తు అమ్మాళ్ కన్యగారును ఉపన్యసించిరి.

పట్టాభి సీతారామయ్యగారు ఆధునికాంధ్రుల జీవితాశయములను గూర్చి ముచ్చటించిరి.

పిమ్మట నల్లముత్తు అమ్మాళ్ గారు "జాతీయత, ప్రాథమిక పాఠశాలలయందలి విద్య" అను విషయమును గూర్చి చక్కగ ఉపన్యసించిరి.

అధ్యక్షులవారు సభను ముగించుచు నల్లముత్తు అమ్మాళ్ గారి యుపన్యాసమును కొనియాడిరి. స్త్రీలు విద్యాశాఖయందుండి ఎట్టి దేశహితకరమైన పనులను చేయగలుగుదు రనుటకు యీమెగారి ఉపన్యాసము తార్కాణముగ నున్నదనిరి.

రామమోహన గ్రంథాలయమును సూరి వెంకట నరసింహం గారు, అయ్యంకి వేంకటరమణయ్యగారు స్థాపించి గ్రంథాలయోద్యమమును హిందూదేశమందంతటను వ్యాపింప జేసినందుకు వారికి వందనముల నర్పించిరి.

రామమోహనగ్రంథాలయమును కేంద్రగ్రంథాలయముగ చేసి ఆంధ్రగ్రంథముల నన్నింటిని యిచట సమకూర్చవలయు ననిరి. అందులకు తాము తగినటుల తోడ్పడుదుమని వాగ్దాన మొనర్చిరి,

పిడ్డిభొట్ల వీరయ్యపంతులుగారు సభాధ్యక్షునికి ఉపన్యాసకులకు ఉపన్యాసకురాలికిని సభ్యులకును వందనము లర్పించిరి. ఇంతటితో సభ ముగింపబడెను.